# సాధనసమితి కార్యనిర్వాహకవర్గము

## వృషసంవత్సరము

ప్రధానాధ్యక్షులు :

శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

అధ్యక్షులు :

శ్రీ భాగి నారాయణమూర్తి

శ్రీ ముజుందార్ నరసింహారావు

ప్రధాన కార్యదర్శులు :

శ్రీ ముదిగొండ సిద్ధవీరరాజలింగం

కార్యదర్శులు :

శ్రీ తిమ్మరాజు శివరామారావు

శ్రీ విష్ణుభొట్ల కామేశ్వరరావు

సంపాదక వర్గము :

శ్రీ నండూరు వెంకటరామ కృష్ణమాచార్యులు

శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు

శ్రీ పువ్వాడ పార్థసారధిరావు

# మ ధు క ణ ము లు



శ్రీ వల్లంపల్లి సోమశేఖరశర్మగారికి —
గౌరవపూర్వకముగా నొసంగినది.

పిల్లలమఱ్ఱి
వేంకట హనుమంతరావు



సా ధ న స మి తి
△ సి కిం ద్రా బా దు △

# పరిచయము :

ఈ మధుకణములను సేకరించిన కవిపుంగవుడు — మా చిరంజీవులు పిల్లలమర్రి వేంకట హనుమంతరావు. ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు ఆనర్సు క్లాసున చదువుచున్నాడు. ప్రాచీన నవీన వాఙ్మయములనిన నతని కెంతయో ప్రీతి. పెద్దలను భృత్యునివలె నుపాసించు గుణ మతనికి వెన్నతో బెట్టిన విద్య. ఇట్టి యువకుని ఈ ఖండకృతికి ఒక్కమాట పరిచయముగ వ్రాయబూనితి.

కావ్యరచనకు ప్రతిభయును వ్యుత్పత్తియును పునాదులలాంటివి. ప్రాచీనాంధ్రకవులలో వ్యుత్పత్తియును, నవీనులలో ప్రతిభయు నున్నతిని వహించుచున్నవి. ఇట్లనుటచేత — నీ యుభయులును, ఏదో ఒక్క శక్తియే కలవారనుకొనరాదు. వీరిలోను వారిలోనుకూడ, ప్రతిభా వ్యుత్పత్తులను రెండింటిని వశపఱచుకొన్నవారు అనేకులు కలరు.

మధుకరమునకు మధుకణముల నేరికొనుటలో ఈశ్వరానుగ్రహీతమగు శక్తియును, యుక్తియును, కూర్పును నేర్పును వలయునంత కలదు. స్వాభిరుచిననుసరించియే, తనకు నచ్చిన పూవులనుండియే — అది మధుకణములను సేకరించును. వానిని నాయట్టివాడెవడేని, ఆస్వాదన కాలమునందు ఏకటముగా పెదవి విఱుపునకు పాల్పఱచినచో, అది అతని యదృష్టమహిమ. మనవలసినదేకాని, చెప్పి యొప్పించు నేర్పు మా యప్పకేని లేదు.

ప్రస్తుత మీ మధుకణముల కూర్పరి — ఖండకావ్య సంపుటిలో అనేక రీతుల అనేక విధములగు మధుకణములను సేకరించినాడు.

అందు కొన్ని మధురములు. కొన్ని ఈషత్తిక్తములు వేఁపపూవుల తావి వోలె; మఱికొన్ని ఇప్పపూ మకరందము వోలె మధుగంధములు. ఇట్లే పెక్కు రకముల పూవులనుండి పెక్కురుచుల నీను కణము లిందు పొందుపఱుపబడినవి. కాని వీని యన్నింటియందును, అనుస్యూతముగా ధారావాహికముగా ప్రవహించు మధుధార, అవిచ్ఛిన్నముగా ఇమిడియే యున్నది. దాన భావుకుల మనసుల నంతరాత్మల నానందపెట్టుటలో వీని కివియేసాటి. పూవుదాఁపియు, శర్కరలోని మాధుర్యమును, తేనెపెఱలోని తేనె రుచియును, సహృదయులగువారు ఆస్వాదించి స్వానుభవమున నెన్నవలసినవియేకాని — ఏవం — అని విప్పి చూప శక్యముకానివి. అట్లే ఈ ఖండకృతుల మాధుర్యము సైతము— అని మనవి.

నే నీ ఖండకావ్య సంపుటిని గుఱించి చెప్పదలచిన దీమాత్రమే. తక్కిన సారస్యములను చదువరులు స్వయముగా నెఱుగగలరు. కాన నతిమాత్రమును ఉజ్జగించి రసజ్ఞుల నొక్కమాఱు వీనిని నాస్వాదింప ప్రార్థించెదను.

బరంపురము,
వృష భాద్రపద బహుళ దశమి.

విధేయుఁడు,
పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.



శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

# నాదు మహతి

నాదు మహతికి తంత్రులెన్నో
లెక్కలేనన్ని ఉన్నాయీ !
నాదు మహతితో నాలపించుట
నేను నొక్కడ తగుదునోయీ !

తంత్రి నొక్కటి మీటు కొనుచూ
దివ్యపురుషుల దింపగలనూ !
తీగ నొక్కటి కదుపు కొనుచూ
తీవబోడుల త్రిప్పగలనూ !
పాట నొక్కటి పాడుకొనుచూ
పాములన్నిటి పట్టగలనూ !

తంత్రి నొక్కట తాళమేసీ
తాండవానికి తావు నిత్తును !
తీగ నొక్కట తలపు బెట్టీ
తీయపలుకుల పలుక నిత్తును !
రాగమొక్కటి రగులు కొలిపీ
భంగిమంబుల పొదిగి వేతును !

ముదముగూర్చే ముగుద ముచ్చట
ముచ్చటించే మేళమొకటీ !

నృత్యగీతము నేర్పడానికి
నాలపించే నాదమొకటీ !
కావ్యగానపు కల్పనానికి
కథలనిచ్చే కంఠమొకటీ !

కొమ్మ యందలికోయిలమ్మలొ
కలసిపాడే కాలమొక్కటి !
పాటిరొదలనె పరుకొనుచూ
వాటిసరణిన వరుస యొక్కటి !
భీతిగొలిపే అలలఘోషలు
పిక్కటిల్లే ఫణితి యొక్కటి !

[ 'గృహలక్ష్మి' నుంచి ]



# నీవు - నేను

అంకితం:
"కళాప్రియు లందరికీ"

నక్షత్రలోకాన
నాట్యమాడుచు నీవు
ఆకాశ హర్మ్యాల
నాలపించుచు నేను
ఆహ్వాన సుమములన్
ఆనంద కణములన్
అందుకొనుచూ మనము
బంధుగుల మయ్యెదము!

నక్షత్రములవద్ద
నవ్యసాహితి నేర్చి
యక్షులను దర్శించి
యక్షగానము నేర్చి
నవ్యసాహితిలోన
నవ్యగానము జేర్చి
దివ్యులందరు మెచ్చ
ధన్యతన్ బొందెదను!

నేకట్టు హర్మ్యాల
గన్పట్టు చిత్రాలు
నేకట్టు హర్మ్యాల
గన్పట్టు మర్మాలు

నీ నాట్యవస్తువై
నిలుచుండ గమనించి
నవ్యచిత్రాలతో
నవ్య మర్మాలతో
దివ్యులందరు మెచ్చ
ధన్యతల బొందెదవు!

నూత్న గానము నేను
నూత్న నాట్యము నీవు
యత్నించి యానంద
రత్నాల గురిపించ
నవ్యసాహితి నేను
నవ్యచిత్రము లీవు
సువ్యక్త భావాల
గావ్యాల నల్లగా
కిన్నరుల్లున్నవైనా
పన్నగాల్లున్నవైనా
నిన్ను నేనును నీవు
నన్ను కొనియాడేము!

ఆకాశ హర్మ్యాలు
ఆవులించంగాను
నక్షత్ర లోకంబు
నాశమందంగాను

నాదు గానము నేను
నీదు నాట్యము నీవు
ఊగించు టెచ్చటో ?
సాగించు టెచ్చటో ?

మాయ మేఘాలనూ
మాయలోకాలనూ
నీదారి రాకుండ
నాదారి రాకుండ—
నాదు గానము నీవు
నీదు నాట్యము నేను
హాయిగా వినగాను
హాయిగా కనగాను—
తరిమి తరిమీ తన్ని
నరులు గానని చోట
విరిసోన యందు మన
మురిపెముల నన్నింటి
నెరవేర్చు కొందాము !

ఉండుండి యుండిండి
ఎండుటాకుల వోలె
ఎటురాలి పోదుమో ?
ఎటుమాటు పదుదుమో ?

*

ఏరాయి చాటునో
ఏరప్పు చాటునో
పడిపోయి యుండినా
విడిపోయి యుండినా
నాదు గానము నిన్ను
నీదు నాట్యము నన్ను
మరపునకు రానీక
పరముడే కనుగాక !

[ 'భారతి' నుంచి ]



# గొబ్బి పండగ

అంకితం:

"కుమారి మంగళప్రదకు"

[ పిండి ఆరబోసినలాగ వెన్నెల. పెరటిలో కబుర్లు చెప్పుకుంట పడుకున్న ఇంటిల్లిపాదికీ కుమారి మాటలే ముద్దులొలుకుతాయి. ]

చీకాటుండంగానే
చెల్లీ తమ్ముల నన్నూ
లేపాలమ్మా నీవూ
రోజూమాదిరికాదూ !
రేపేనమ్మా రేపే
గొబ్బీపండగ గాదా ?
చెట్లా పట్లాల్పట్టీ
చక్కా సామెతల్చెప్పీ
పరికిణినిండా తెస్తాం
పచ్చని బంతీపూలూ !
బాపయ మామా నడిగాం
పొద్దున రమ్మని పలికే
గోవూపేడా తెస్తాం
గొబ్బీ దేవరకోసం !
తెల్లావారేసరికే
తెచ్చీ పెట్టాల్గొబ్బీ

వచ్చే పొయ్యే వాళ్ళూ
వహ్వా ! వహ్వా ! అనాలి !
ఏమే అక్కా ! ఊరక
ఏమిటాలోచన నీకూ ?
బావారాడని కాదా ?
పందెం ! ఎంతో చెప్పూ
నిన్నే గాదా జాబూ !
నిజంగ వస్తా నన్నది !
నాన్న నడగవె యింకా
నామాటబద్ధమైతే !
తెల్లావారక మునుపే
తలంటిపోయవె మాకూ
మళ్లీవచ్చేసరికీ
ముగ్గులు పెట్టించాలీ !
గుమ్మంలోనా బావా
కాలూపెట్టంగానే
కసుకుమంటూ గొబ్బీ
కాలూ కంటుకొనాలీ !
ఏంరా ! సత్యం బావా !
ఏట్లో మట్టితో నీవూ

సంకురుమయ్యను మాకూ
చేసీపెట్టవ రేపూ ?
తాటాకొకటీ తీసీ
తడిపేసే ఉంచాను:
దానితో నీవూ నాలుగు
తూంతూల్చేసీ పెట్టగి !
కచ్చేర్నావడి లోపలి
కప్పతాబల్లను చాన్నా !
తెచ్చిపెట్టవె రేపూ
తెల్లావారంగానే.
బావా వచ్చేసరికే
బొమ్మల నన్నీ పెడతాం !
బావా బొమ్మా ఉండవు
పక్కా నేనే ఉంటాను !
పందెము మాటా చెప్పీ
పకపక నవ్వించేస్తా
అక్కయమీదా చెప్పీ
అప్పుచు లందూకొంటా !
రేపూ బావకు, అమ్మా !
తలంటి నురుగూ పోస్తా !

సీకాయంటూ తన్పుడూ
చేతికి యిస్తానేనూ !
అందరికన్నా ముందూ
అందాల్బొట్టా లేనూ
కట్టుకూర్చుంటానూ !
కళకళలాడ్తూ లక్ష్మిలా
కదలీ రావా లింటికి !
బావా అక్కయ్యలాకూ
పాటాపాడీ నేనూ—
పంచుకోవా ప్రేమా
పండగ హారతి పళ్లెం !

[ ‘ వినోదిని సంక్రాంతి సంచిక ’ నుంచి ]



# ఏ మౌ తా రు ?

ధనికులమంచూ
గర్వముపాలై
బీదల సాదల
కన్నుల గానక
నడవడి చెరప్రకు
పాడౌతారా ?

జ్ఞానం లేకా
మద్యంత్రాగీ
ఒడలును మరచీ
తడబడి నడచీ
అందరినోళ్ళా
పడిపోతారా ?

సంఘీభావం
అనునది లేకా
హుళక్కి-భావం
నటనల నడపుచు
అన్నల తమ్ముళ్లు
తమ్ముల నన్నలు
కొట్టుచు తిట్టుచు

రచ్చకేరా ?

ధర్మాధర్మం
తెలిసీ తెలియక
చేసిన తప్పులు
భరించడానికి
ఉందొక దేవత
అనుకొని మనమున
తెలిసియు తప్పుల
నెన్నో చేసీ
పాపపు పంకా
ల్లోపడ్తారా ?

కామం మంచిది
కాదని తెలిసీ
ధర్మం ఎపుడూ
ఊతని యెరిగీ
ప్రపంచమంతా
మిథ్యని తెలిసీ
జీవి రహస్యం
"ఇది"యని యెరిగీ
మళ్ళీ కామం

వెంబడి పరుగిడి
సుడిముడి గుండం
పాలాంతారా?

[‘చిత్రగుప్త’, ‘విద్యార్థి’ నుంచి]



# నృత్యరంగం

కొబ్బరిచెట్లూ
అబ్బురమందా
స్వాగతమిచ్చెను
చెరియొక ప్రక్కా !

ఆవలనున్నా
ఆకసరంగము
నలంకరించెను
అంబుధి తనయుడు !

మబ్బుల తెరలూ
దబ్బున తొలగెను
ఉడుపతి నటనకు
అడుగులు వేయగ !

పక్షుల శ్రేణులు
పరుగునవచ్చి
మంగళ గీతము
మేళవించినవి !

స్వాగతమందని
సాగరుడేమో

భీకరరూపుతో
బొబ్బలువెట్టెను !

చంద్రుడు సలిపెడి
సాత్విక నృత్యము
గాంచిన చెట్లూ
అచ్చెరువందెను !

ఇసుకలు చంద్రుని
పసలను కనుగొని
తెలతెలవోయెను
వెలవెలబారెను !

ఉడుపతి తారతో
అడుగులు వేయగ
"అవురా ! ప్రణయము !"
అంచునులోకము
అచ్చెరు వందెను !

"తారాచంద్రుల
తలపులు, రాగము
మరువని వగుచూ
విరువని వగుచూ

తరతరములకూ
తీరని కథలై
మాయని మరులై
ముద మొనగూర్చును !

ఆ ప్రణయనిధే
అనుకరణీయం !
ఆ ప్రణయనిధే
ఆదరణీయం !"

ఈవిధి తలచుచు
కోవిదులుండగ
మబ్బుల తెరలూ
మసలుచువచ్చీ
లాస్యపురంగము
"లూతీ" గొన్నవి !

['దీపిక' నుంచి]



# ప్రభాతం

అంకితం:

'మా సత్యం బావకు'

చీకట్లో నేనేమొ చిందులెడుతున్నాను
నట్టేట నేనేటొ కొట్టుకెళుతున్నాను
ప్రళయచిహ్నాలేమొ ప్రబలినట్లున్నావి.

వెనుదిరిగి చూచాను
జగమేమొ తలచాను
కనుచూపు మేరలో
కనుపించ లేదేది!

బ్రహ్మాండభాండంబె బ్రద్దలౌతున్నాది
గాఢాంధకారమ్మె గ్రమ్ముకొస్తున్నాది
నిశ్శబ్ద దేవతే నిర్ఘాంతపోయింది.

ఎలుగెత్తి పిలిచాను
చెవియొగ్గి విన్నాను
ప్రతివచన మెవ్వరూ
పలికినారే కారు!

కడలిలో మంచేను కదలలేకున్నాను
అంధకారాన్నుంచి అవలబడకున్నాను
దరిజూపు దాతలూ దరిజేర రెవ్వరూ

ఒరులేల వస్తారు
దరిజూపెటందుకూ
ఎవరిపని వారిదే
ఈ స్వార్థ జగతిలో!

చీకట్లు నాముందు చెదరిపోతున్నావి
కడలిలో నీళ్ళేమి కండ్లబడ కున్నావి
దూరాన ఎవరోను పిలిచినట్లున్నాది.

కనుదెఱచి చూచాను
మిరుమిట్లు గొలిపేటి
దివ్యసుందర జ్యోతి !
చెవియొగ్గి విన్నాను
కలకలా మనియేటి
విశ్వమోహన గీతి !

జ్యోతిలో నాకళ్లు ద్యోతకమ్మవలేదు
అచ్చెరువు నా నాల్క నట్టె నిలిపేసింది
చేతుల్ని రెంటినీ జోడించి నిలిచాను.

కలనాదమది యేటొ
కదలి నట్లున్నాది !
వడిగాను నను జేర
వచ్చునట్లున్నాది !

దరిజేర రాగాను నాగుండె దడదడనె
దగ్గరింపంగాను నామనసు గుబగుబనె
దేవతగ తలపోసి ప్రణమిల్లి నిలచితిని.

ప్రేమతో మెల్లగా
తానేమొ, నామీద
చల్లనీ చేయేసి
నిమిరినట్లున్నాది!

ఒడిజేర్చి పాలిచ్చె కన్నతల్లీ ప్రేమ
మనసిచ్చి మోదించు చిన్నపడతీ ప్రేమ
మించెనా?—అన్నట్లుదోచె నామనసునకు!
కోమలీ మీటినా తీగలోనీ హాయి
కోయిలా కూసినా కూతలోనీ హాయి
మీరెనా?—అన్నట్లు దోచె నామనసునకు!

ఆ ప్రేమ కనగానె
గుండె దడదడ మానె!
ఆహాయి రాగానె
మనసు గుబగుబ మానె!

అదృష్టజీవినే నొకడనని యనుకొంటి
ఈపాటి భాగ్యమిం కెవ్వరికి ఉందంటి
ఒరులతో నాకేమి యికమీద పనియంటి!

హార్షముతో ఉప్పొంగి
పోయినది నా మనసు
ఆనంద బాష్పాలు
ఆపేసె నాచూపు !

*

*           *           *

*

కలనాద మదియేటో కదలినట్లున్నద
వడిగాను ననువిడిచి పోయినట్లున్నాది
ఉలికిపడి ఉరికాను; అదరిపడి అరిచాను.

కనపడదు ఆజ్యోతి
వినపడదు ఆగీతి—
వెదికాను, పిలిచాను
విఫలతే ఫలమాయె !

వెనుకటీ తిమిరాలు, నిశ్శబ్ద కెరటాలు
గుండెలో మనసులో ఝుంఝూమరుత్తులూ
దారులూ డొంకలూ కంటకావృతములూ

తిమిరాల్లో జారబడీ
కంపల్ని కాల్చేసి
కంచుకాగడాల్తో

గాలించినాగాని
గాలిలో దీపమే !

*

చేతులారా నేను చెడగొట్టుకొంటినే
వచ్చినా సమయాన్ని పోగొట్టుకొంటినే
అపరాధ మేమైన జరిగెనా నావలన ?

విలపించి, విలపించి
విసుగెత్తి పడిపోతి—

*

నింగినుంచీ ఎవరో
భంగినంతా వినిచె.

*

తలయొగ్గి ప్రణమిల్లి
ఆవాక్కులే వింటి...
భానుడూ మదిలోన
ప్రభవించి నట్లయ్యె !

[ 'దివ్యవాణి విజయసంచిక' నుం



# [illegible]ంతవృత్తం

అంకితం:
'మము బాసిన రామమోహానునికి'

మానినియొక్కతె మారుని కోలల
మాయలో మునిగింది !
చారుని నొక్కని వలపులరాయుని
జేరగ బనిచింది !
పోడని, రాడని, జాడలు చాలగ
చూడగ దొడగింది !
మారుని వేపుకు తాళగజాలక
మానిని వనరింది !
పాపము దలచని పాపులె సుమ్మని
శాపము వెట్టింది !

౨

చారుని మాటలు వినగను రాయుడు
మానిని వాడయ్యె !
చారుని తోడను రాయుడు మానిని
జేరగ కోరంగ !

త్రోవలో నడవిని దోచిన పులుగుల
ద్రోయుచు వెడలంగ !

చారుని మనమున క్రూరపు తలపులు
దూరుచు వేచంగ !

మానిని తావుకు త్రోవని వేరొక
మార్గము జూపంగ !

మానిని జాడలు గానక రాయుడు
మారుని దూరంగ !

మారుని మాయల దగులుటకన్నను
మరణమె మేలన్న !

3

కాముని కోలల కాగక చారుడు
కానల దిరుగంగ !

కాముని వీధుల దిరుగుటకన్నను
కానలె మేలన్న !

కామితభాగ్యము లభ్యముగాకను
కాయము వీడంగ !

౪

కానల దిరుగగ చారుని శవమును
మానిని చూచింది !

పాపము, తనదగు పాపపు శాపపు
ఫలమని తలచింది !

మానిని హృదయము చారుని చావుకు
మంచుగ కరగింది !

తాపము కోపము రాపిడి జేసిన
పాపము పండింది !

౫

కానల వెదకుచు రాయుడు చివరకు
కదలక పడిపోయె !

శాపపు బలిమినొ తిరిగిన శ్రమనో
ఊపిరి బిగిసింది !

బొత్తలు పడినా కన్నుల తోడను
బిత్తరి జూడంగ !

పాపము మానిని జేరగ జేరగ
పదములు రావాయె !

చేతుల శబ్దము చేయుదమన్నను
చేతులు రావాయె !

రాయుని రాకను యెరుగక మానిని
రాడని వాపోసె !

రాయుని తపమున మానిని పాపము
రాయుని జూచింది !

మానిని రాయుని జేరెడు లోపల
ప్రాణము లేదాయె !

*

వారల నింతలు జేసినశాపమె
వరుడని తలచింది !

*

*            *

కావ్యము లల్లా కామిని యొక్క-తె
కవులకు మిగిలింది !

*            *

*

['విద్యార్థి' ను

# డలి : కవిత

అంకితం :

'మా పూర్ణచంద్రునికి'

క్రళలు దెలుపగ కలము నడవదు
అలలఘోషా అట్టె నిలువదు !

◆

విరహావేదన వేగిరించుచు
కరము చల్లని కథల జెప్పుచు
నింగి చంద్రుడు నాట్యమాడును !
కాంతితోడను కన్నుపండుగ
శాంతితోడను శ్రవణ సంపద
నొనర జేయుచు..........
తొంగి చూచుచు తొలగి మబ్బుల,
నింగి చంద్రుడు నాట్యమాడును !

◆ ◆ ◆

ఇసుక తిన్నెల నింతియొకతే
రసికహృదయుల రాక చూచును !
తోటికవితల తోడనాడగ
తోటలందున పాటపాడగ
మీటబోవును హృదయ తంత్రుల
చాటబోవును తత్త్వబోధను !

◆ ◆ ◆

కవుల స్వనముల కాసపడుచూ
కరము జాపును కడలిరాజూ !

♦ ♦ ♦

మంచి మాటతో మబ్బు తునకల
మాయ బరచీ 'మామ' యెక్కడె
మరులు గొలుపా మరల నగపడు
మందహాసపు మొగముతోడా !
బోసినోటీ హాసచంద్రిక
ప్రసర మందెను పూతజలముల !
సంతసమ్మతో సంద్రుడపుడూ
చంద్రు ముద్దిడ చేయి జాపెను.

♦ ♦ ♦

చంద్రుడేమో చేరజనకా
చిన్నతనపూ చేష్టతోడా
చెమ్మచెక్క ! అనుచు నెగిరీ
కొమ్మమేఘపు చీరచాటున
నక్కియుండెను బిక్క మొగముతో—
భీతిగొన్నా లేడిలాగా !
గారెదొరకని తమ్ములాగా !
లెక్కరానీ పిల్లలాగా !

♦ ♦ ♦

కడలి కొమరుని కొంటె చేష్టకు
అలిగిపోయెను కడలిరాజూ
పైకి వచ్చే ప్రేమపొంగుతో
బ్రతిమిలాడెను పలువిధములా !
విసుగు తోడను, కోపమూనీ
కసరుకొనియెను గానరామికి !

* * *

విఫలమందీ విరిగిపోయెను
కడలిరాజూ కరములపుడూ !

*

కొంతకాలము కడలిరాజూ
కన్నుమూసెను ! గళము తెరిచెను !

* * *

ఇసుక తిన్నెల నింతి బింబము
చంద్రుడనుకొని చేరజనియెను
ఎంతదవ్వేలో ఆశపడుచూ
చెంతకొచ్చీ పోల్చిచూచెను !

* * *

పాప మట తను భ్రాంతిపడుటకు
తాపమందెను తప్తహృదయము !
ఆశలన్నీ యణగిపోయెను !

'ఉస్సు'రనుచూ ఊర్చె సంద్రుడు.
కుమిలికుమిలీ క్రుంగిపోయెను!
కణము కణమూ కూలిపోయెను!
కడలిరాజూ కొడుకుకొరకూ
ఘోడు ఘోడున ఘోషపెట్టె!
నీలిముసుగులో అశ్రుకణముల
జాలిదోపగ రాల్చి వైచెను!

• • •

తీరమందూ తంత్రి మీటుచు
దివ్యగానము తీర్చిదిద్దెడి
కవికుమారుని కాళ్ళముందట
కరగి పోయే గుండెనదిమీ
వేడుకొనియెను వేయినోళుల!

*

ఈడు బొందని యింతిలాగా
నిధులు తొలగిన భోగిలాగా
పెయ్యబాసిన ఆవులాగా
భోరుమనుచూ బొబ్బరిల్లెను!

• • •

కవికి చేరువ కావ్య కన్నియ
అశ్రుబిందుల నొకటి రెంటిని

అందజేసెను : ఆదరమ్ముతో
కళ్లు రెండును వప్పజెప్పెను;
అక్కజమ్ముతో అడలి పోవుచు
అండజేరెను అతని యందూ !

♦

కవియు పాపము కరుణతోడా
కరగిపోయెడి గుండెతోడనె
నిబ్బరమ్మును నిలుపుకొనుచూ
అబ్బురమ్ముతో అతనితోడా
ఇట్టులనియె ఇష్టగోష్టి :—
"కడలిరాజా ! కుందబోకుము ;
పడుచు లేచుచు పరుగులెత్తుక
ఏటికింతల నెదను జీల్చుక
ఎలుగు వెట్టెదు ? కలచివైచెదు ?
నురుగు గ్రక్కెద వుగ్రగతినీ ?"

❋

సంద్రుడపుడూ కవిని జేరీ
చంద్రునేమో చేర్చమనియెను:
కవియు దనకూ కార్యఫలముకు
కాసక్కలడిగెను కడలిరాజును.

♦ ♦ ♦

కడలిరా[illegible]ణతోడను
"కానుకకేమీ కొదువలేదూ
నన్నుచూడగ నాట్యమాడుచు
నవ్యకవితా నిన్నుజేరును;
నాదు పుత్రుని బ్రస్తుతింపగ
నవ్య భావము నిన్ను జేరును."
అనుచు వరములనందజేసెను!

* * *

అంత కవియూ ఆలసింపక
సంతసించుచు శ్రవణపుటముల
వింతచెలువపు విలువ మాటల
కొంతకాలము గాన మాధురి
చందమామకు స్వాగతమ్మను
విందుగూర్పగ నందజేసెను!

♦

కారుమేఘము కదలిపోయెను;
నీలిముసుగును రాల్చివైచెను;
చిన్ని చంద్రుడు చిలికె వెన్నెల!
బాలచంద్రుడు బయటికొచ్చెను!

♦

కడలిరాజూ గంతు వేసెను
కావ్యకన్నియ కాటుకెట్టెను ;
కవికుమారుడు కళలు దిద్దెను ;
మలయపవనుడు మేళవించెను :

♦

“కడలిరాజా ! కూర్మి నుండుమ
కొడుకుతోడా. . . .”

*

కావ్యకన్నియ కరము బట్టుక
కవియు మెల్లగ కదలి పోయెను ;

♦ ♦ ♦

సంతసమ్ములో సంద్రుడేమో
సరకు గొనకా సమ్మతించెను.

* * *

కవికుమారుని, కావ్యకన్యను
కనకయుండని కలువరేడూ
తానుసైతము వారితోడా
తరలి వచ్చెదనంచు బలికెను !

*

కదలిపోయిరి కావ్యమల్లగ !
మిగిలిపోయెను కడలిరాజూ !

*

# అశ్రు చయము

అంకితం:

'ఇటువంటి అనాథులందరికీ'

[ప్రాయమందని పసికన్నె. అభము శుభమూ ఎరుగని వయసు పసుపు కుంకుమ మాసినది. జీవితమొక మెరుపువంటిది. రెండు క్షణాలలో కళ్ళను మిరుమిట్లు గొల్పుతుంది. మరుక్షణం కారంలో అణగిపోయి నిరాశ కల్పిస్తుంది. చిన్నినాథుని విధి నో కొన్నది ఎరుగని కన్నె సోయగముపైనా, అమాయకతపైనా జా రాలిన బిందువులివి!]

ప్రొద్దు ప్రొద్దునె
పొన్న పూలను
అద్దమందున
దిద్దుకొందువు!
    ఎవరికోసరమింత ?
    ఎందుకోసరమింక ?

చిన్నినాథుని
చిత్రపటమును
పొన్న పూలతో
పూజసేతువు!
    ఎవరికోసరమింత ?
    ఎందుకోసరమింక ?

చెలుల గూడుక
చెలువు మీరగ
చిట్టి బొట్టును
పట్టుచుందువు
　　ఎవరికోసరమింత ?
　　ఎందుకోసరమింక ?

ఆటలందున
అలరుబోడులు
నాథునడుగగ
నవ్వుకొందువు
　　ఎవరికోసరమింత ?
　　ఎందుకోసరమింక ?

[ 'ఆంధ్రభూమి' నుంచి ]



# సుఖ దుఃఖాలు

తారల్లుపై పైన
తైతక్కలాడగా
రేరాజు చుక్కల్లో
హాయిగా నుండగా
నేనేమొ నాలోన
నవ్వొచ్చి నవ్వాను !

తారల్లో రేరాజు
తరలిపోతూండగా
మేఘాల్లో రేరాజు
దోబూచులాడగా
నేనేమొ నాలోన
కన్నీరు కార్చాను !

దూరాన రేరాజు
ననుజూసి నవ్వాడు
ఆనవ్వు వెన్నెలై
పరిణామ మందింది !

మేఘాలు ననుజూసి
కంట నీరెట్టినై
ఆనీరు వానగా
మారుచూ వచ్చింది !

అంతలో కన్నీరు
అంతలో నవ్వులూ
ఈరీతి రెంటికీ
అన్యోన్య బాంధవ్య
మున్నట్లు తోచింది !

నవ్వులో కన్నీరో
కన్నీట నవ్వులో
గుర్తించ లేకుండ
కలసియుంటావనే
ఊహలో పడ్డాను !

[ 'భారతి ' నుంచి ]



# ప్రసూనం

అంకితం:
"దివంగతుడైన సోదరుడు సుబ్బులుకు"

౧

పూవులెన్నియొ పూసిపూసీ
పురాకృతాల ఫలితమనగా
నాశమందగ శేషఫలమై
ఒక ప్రసూనం నిలిచింది!
పుట్టిపోయిన పూలకోసం
పొంగి పొరిలే దుఃఖ సంద్రం
గిట్టినట్టీ పూవుగాంచగ
మాయమందీ ప్రేమమంతా
ఏకాగ్రతన్ బడసింది!
ఆ ప్రసూనం అల్లనల్లన
ప్రసరమందెడి మందమారుత
వీచికలతో కలసియాడుచు
ప్రాణమంతా కన్నపూపై
నిలిపి మురిసే తల్లిదండ్రుల
గారబానికి ప్రేమకంతకు
కేంద్రరూపై వెలిసింది!
పోయి పోయీ దక్కినట్టీ

పూవుకోరిన కోరికలన్నీ
కొదువలేకా తీర్చిపెట్టుచు
తల్లిదండ్రులు, లోకమైనా
స్వర్గమైనా ఆ సుమంతో
అమరునంచూ మురిసెదరు !
తాను పుట్టిన తావు ఎదియో
తాను పెరిగిన విధమునైనా
అరయగలుగని అజ్ఞానం !
తల్లి మనసును తెలిసికొనెడీ
తండ్రి విధమును తలచి నడిచే
ప్రాయ మందని పసితనం
ఈప్సితార్థా సిద్ధికొఱకై
ఇడుమలెన్నియొ గుడుచు వారలు
కంటబడనీ తన ప్రపంచం
దుఃఖవీధికి దూరమా !
జననమాదిగ కష్టమనెడీ
పదము నెపుడూ వినకపోవుట
కారణమ్మగ, కష్టజీవుల
హృదయ మరయుట నెరుగలేదా
ప్రాయమందని ప్రసూనం !

భ్రమరఝుంకృతి భావమేదియో
భృంగ సుమముల భంగిమంబెదో
అభము శుభమూ అరయ జాలని
ఆసుమానికి అవ్యక్తం !

౨

భ్రమర సుమముల భ్రాంతులన్నీ
ప్రకృతి పురుషుల ప్రణయభావపు
ఛాయలే !
భ్రమరఝుంకృతి ప్రణయ గేయం;
భ్రమర గమనం ప్రణయ కోపపు
తిమిరపంక్తికి ప్రభాతం !
భ్రమర గీతమె యుపనిషత్తూ ;
భ్రమరస్పర్శే ప్రజ్వలించే
ప్రణయ వహ్నికి దోహదం !
కుసుమ హృదయం భ్రమరహృదయపు
ప్రణయ ఫలకం.. ... ... ... !
కుసుమ హృదయం భ్రమర మనసును
భద్రపఱచే భమిడి భాండం !
భ్రమర సుమముల భావిప్రణయం
భావ ప్రపంచ భాండమందూ

దివ్యకల్పిత దివిటి బెట్టి
అరసి చూచిన, అంధకారమె
అరికట్టు !

3

భ్రమర మొకటి లోకజ్ఞానము
బడయువాంఛతో దేశదేశము
తిరుగుకుంటూ, జనకస్థానము
వదలిగడపెను బాల్యముఁ !
తాను సైతము తల్లిదండ్రుల
కొకడగుటను ప్రేమ మందును
భాగ్యమందును కొదువలేకా
పూర్ణముదమును కొల్లగొను !
జనకస్థానము దూరమగుటను
ముళ్ళకంచెలు గులకరాళ్లూ
ఎదురు నిలుచుని దారికడ్డము
తగిలినై !
లోకజ్ఞానము కొంతతెచ్చుకు
లోటుబాటుల లెక్కసేయక
అడ్డగించే అంధకారము

ఆవులించే టంత వఱకూ
వేచ నెన్నో వేసవుల్ !
లోతు తెలియక లోకులందరు
కూయుచుండెడి కూతలన్నిటి
సరకు సేయక సరళమనసుతో
కలిసి మెలగుచు గడిపె కాలము
లెన్నిటినో !
పూలవనముల పరుగులెట్టెడు
భ్రమర సంతతి భావమెఱిగియు
నెఱుగనటులనె యెడము చూచుచు
సేవగించుచు నేగుచుండును
విముఖతన్ !
తాను తిరిగెడు తావులందూ
ప్రసరమందెడి పుష్పసౌరభ
మలర జేయదో ?
ప్రణయరాణులు ప్రేమతోడా
పలకరింపరో ?
సుమములెన్నియొ సుకముగోరుచు
భ్రమరమనసున భ్రమలు గొలుపగ
వివిధరంగుల వివిధతావుల
విలసిల్లున్ !

విరులుకొన్నీ విరహావేదన
కాగజాలక యాగజాలక
భ్రమరరాజమున కెదురు చూసీ
చూసిచూసీ, వాడి వోడి లీ
రాలి, వేడిగాలుల కెండుట
కనుల బడవో?

౪

కాలమేమో కరుణతోడను
కానుకలిన్నీ కట్టుకొచ్చీ
కన్నెపూవుకు గానుపించెను!
వాయుదేవుడు వత్సలతతో
వరములిన్నీ వెంటదెచ్చీ
వన్నెచిన్నికి వప్పజెప్పెను!
వర్ష దేవత వనము నంతట
వింతనృత్యము వికటహాసము
ఒనరజేయగ, విరులమీదను
వజ్రరాసులు ఒలికి పోసెను!
వలపుతానే వనములన్నీ
వరునికొరకూ వెదకివచ్చీ
వింతగూర్చెను విరికన్నియకు!

వెనుక నెప్పుడు వినగనోపని
వీణారవము వెలికివచ్చినది !
హృదయ తంత్రుల నన్నినొక్కుట
చెదరగొట్టినది ; చిక్కుపరచినది !
పూర్వమెఱుగని పూల సౌరభ
మలముకొనియెను - అవనియంతా !
కన్నెపూవూ కనులువిచ్చెను -
పున్నెమేమో పూలురాలెను !
భ్రమలదరియని భ్రమరరాజము
తోటివారితో మాటలాడుచు
పూలవనమున పోవుచుండగ
నవ్యగీతము నాలకించెను !
నవ్యసౌరభ మనుభవించెను !
ఆలకించుచు ననుభవించుచు
నాలపించగ నాగిపోయెను :
తోటివారలు మీటబోయిరి
తమదు తంత్రుల తత్వగీతము—!

* ♦ *

పూవుకన్నియ పాటపాడెను.

* ♦ *

కఠినగుండియ కరగిపోయెను ;

తుమ్మెదేమో తంత్రి కోరకూ
తడవుకొన్నది—
ఎరుగరానీ ఎంచరానీ
హాయినేమో అనుభవించెను
పూవుకన్నియ ప్రక్కతానూ!
తంత్రిమీటీ తాళమేసీ
తాండవించెను త్రాచులాగా
తన్ను తానే తలచకుండా!
కష్టతిమిరము కదలిపోయెను;
హర్షచంద్రిక లలముకొనియెను;
పూలవనములో పూర్ణముదమును
పూర్ణచంద్రుడు పుకిలించెను;
ప్రణయ మిథునము పంటపండగ,
పక్షులన్నియు పాటపాడెను
ప్రణయదేవికి ప్రణుతియనగా!

*

భ్రమరరాజము భ్రాంతితోడను
సుమము చెంతకు చేరజనియెను
నృత్యగీతము నాలపించుచు
నవ్యాశ్లేష మభిలషించుచు,
ప్రణయరాణికి ప్రణతులిచ్చెను!

పూవుచుట్టును చుట్టివచ్చెను;
మలయపవనుని మరులవలనా
సుమము సుడివడి చెదరిపోయెను
ప్రక్కనున్నా పత్రతతిలో!
పూవునందగ పత్రతతిలో
దూరిపోయెను దారిగానక!
భ్రమరమెంతో బాధపడియెను—
బయటలోపల బరువెదోచెను.
ముండ్లుకొన్ని ముందు నిలుచుని
మొండికేసెను మెదలమనుచూ!
వాయుదేవుడు వనమునంతా
విరుగ దన్నుచు వెడలనీయడు!
శరచ్చంద్రుడు సమయమనుకొని
సాగిపోయెను సాగరానికి!
ప్రణయరాణియు పగిలిపోయిన
గుండెనదిమీ, గళము తెరిచెను!
పలుకు వెడలదు పాపకర్మము
నలిగిపోయెను నాల్గుదెసలా!
కొంత తడవుకు కొమ్మచిన్నిని
కుపితహస్తము కోసివైచెను!

*   *   *

"ముద్దు మురిపెము సద్దుకొనెనా ?
ఆశలన్నీ అణగిపోయెన ?
ప్రణయగీతికి ప్రళయ మొచ్చెన ?"
అనుచు భ్రమరమె అడలిపోయెను ;
భూమి బడినా పూవుచుట్టును ;
భోరుమంచును భ్రమర మేడ్చును.

*    *    *

పూలవనములో
పూవులన్నియు పొగిలిపోయెను—
పక్షులన్నియు పారిపోయెను—
ప్రణయ మిథునము వీడిపోయెను.

*    *    *

కరుణతోడా కృతుల నల్లగ
కవుల ముందర గానుపించుచు,
భ్రమరమెపుడూ భోరుమనునూ
ప్రణయవృత్తము పలుకబోవును !

*    *    *

శాంతిదేవత సముదయించును !

['ఆంధ్ర విశ్వవిద్యాలయ సంచిక' నుంచి]



# కలికాఠిన్యం

కానరానిదీ కలికాఠిన్యం
కాలిడబోకుర కర్దమ భూమిని!

పాలనీ మరపించి
విసమునే త్రాగించు!
పూలనీ భ్రమపెట్టి
ముండ్లలో నడిపించు!
వెలుగనీ మురిపించి
చీకటుల నుసిగొల్పు!

కానరానిదీ కలికాఠిన్యం
కాలిడబోకుర కర్దమ భూమిని!

శిఖరాల కెక్కించి
పలురాల పడగొట్టు!
శాంతితో జోకొట్టి
చింతతో చెడగొట్టు!
దరిజేర బోధించి
చెరలతో బేధించు!

కానరానిదీ కలికాఠిన్యం
కాలిడబోకుర కర్దమ భూమిని!



# నా రాణి

అంకితం :

'మనసులో వర్తించు కులకాంతకు'

గాలుల్ని తోడుగా జేసికొని
వాగుల్ని వెంట తా బెట్టుకొని
అడుగులో అడుగేసి
అరుదెంచు నారాణి !

పక్షులా కలకలపు సవ్వడిలో
ఆవులా మువ్వలా సందడిలో
సవ్వడే సలుపకే
సనుదెంచు నారాణి !

సందె పడతీ పమిటెలో దాగి
పిందె వెన్నెలా కన్నులే మూసి
ఒంటరిగ పదిలెముతో
ఒదిగొచ్చు నారాణి !

సరసులో హంసలతో చదువుకొని
వన మయూరాలతో వల్లెవేసి

వొయ్యారి నడలతో
వచ్చేను నారాణి !

పన్నగా ల్నృత్య భంగిమ దెల్ప
ప్రవాహాల్నాట్య పాఠము జెప్ప
నటనంపు నడలతో
నర్తించు నారాణి !

సంద్రంపు కెరటాల సరణిగా
గర్భిణీ మేఘాల విధముగా
ఊగేటి నడలతో
ఉరికొచ్చు నారాణి !

కోకిలపు గీతముతొ కృతినంది
సెలయేళ్ల గానముతొ శ్రుతిజేసి
పగడంపు పెదిమెలూ
కదిలించు నారాణి !

పంజరపు చిలుకతో బంచుకొని
నాణెంపు వీణతో నడకగొని

తీయనీ రాగాల
తేలించు నారాణి!

నిశ్శబ్ద వనితతో చెలిమిగొని
నిద్రించు లోకముతో కరుణగొని
తేనె గుసగుసలతో
ప్రేమించు నారాణి!

చంద్రుణ్ణి సాక్షిగా బెట్టుకొని
ప్రేమమే గుర్తుగా జేసికొని
మనసునూ మనసునూ
ముడివేయ మంటాది!

పత్రాల్ని శిరమునా యుంచుకొని
చేతుల్ని రెంటినీ పట్టుకొని
ఒరులనూ ఒల్లనని
ఒట్టెట్టమంటాది!

సుందరపు కుసుమడోలిక జేరి
కుందరదన సోయగమున సోలి

కారుణ్య కానుకగ
కౌగిలీ మంటాది!

అనిశమూ రాత్రిళ్లె
అమరవలె నంటాది!
ప్రేమతో జంటగా
ఉండవలె నంటాది!
కలనైన యెడబాటు
కనగూడ దంటాది!

బాలభానుని రాక దెలుపంగ
జంతుజాలము మేలుకొలపంగ
కూతకూసెను కోడి
'కొకొకో' రవముతోడి!

చుక్కలన్నియు సొక్కిపోయినవి
పక్షిసంతతి గూళ్లు వదలినవి,
తూరుపూ కోనలో
తొలిరేఖ దోచగా!

పచ్చనీ పైరుపై తుషారము
ముత్యాల కాంతినే దాల్చినది
తొలికాన్పు పసిరేఖ
తొంగి చూడంగాన !

ఆనందముతో చెట్లు తలలూచె
ఆహ్లాదముతో పద్మములు విచ్చె
పచ్చని ఉషఃకన్నె
పకు్కమని నవ్వగనె !

తోకత్రొక్కి-నా త్రాచుపోలిక
కోపముతో బుస్సుమని లేచినది
తొలివెలుగు తనమీద
తగులగనె నారాణి !

సిరితొలగినా భోగి విధముగా
చింతతో ఉస్సురని ఊర్చినది
రానున్న ఎడబాటు
రగులుకొన నారాణి !

పగతోడ మెటికలే విరిచినది
కసిదీర నోరార తిట్టినది
ప్రత్యూష రేఖల్ని
పరికించి నారాణి !

తూరుపూ కోనలో రేఖలకు
తావీయ స్రుక్కి-నా చుక్క-ల్ని
ఈర్ష్యాళువులని బహు
నీసడించును రాణి !

చెరిగినా ముంగురుల దిద్దుకొని
చెదరినా పైటనూ సవరించి
దీనముగ నాదిక్కు-
తిలకించు నారాణి !

పూదండ సరిజేయ యత్నించి
పరిమళము చనెననీ తపియించి
ప్రేమంపు పూదండ
నలుపవలదంటాది !

గొలుసుల్ని మెడలోన వేసికొని
మెలికల్ని గాంచి లో నుప్పొంగి
ప్రేమంపు గొలుసులూ
విడగూడ దంటాది !

చెమటగల చెక్కిళ్ల ముద్దిచ్చి
ఆనందముతొ రెప్పలర మోడ్చి...
తెలివొంది — నెమ్మదిగ
'పోయివ' త్తంటాది !

కొమ్మలో కోయిలా 'కో' యనుచు
ప్రణయవృత్తముల ప్రస్తుతింపగ
తలచుకొని తలచుకొని
తావిత్తు నాశలను !

జంటగా గువ్వలూ జనుచుండి
ప్రణయవృత్తముల ప్రస్తరింపగ
తీయనీ ఊహాలకు
తావిత్తు మదిలోన !

మధువు గ్రోలెడి మధుప మేతెంచి
ప్రణయవాక్కులు పలుకుచుండగ
చిత్రాలె చిత్రించు
కావ్యాలె కలిపింతు !

[ "అంజలి నుంచి" ]



# న వ క వి

తెల్లనిపంచా
సన్నని లాల్చీ
కంటికి 'స్పెక్ట్సా'
కాళ్ళకు 'ఫ్లైక్సూ'
చేతులో 'ఫైలూ'
అమరకపోతే
నవకవి కాడూ !

నోట్లో ఖిల్లీ
చంకలో 'షెల్లీ'
'స్విస్సూవాచీ'
'సిగరెట్ కేసూ'
అలరకపోతే
నవకవి కాడూ !

'వైతాళికులూ'
'ఎంకి పాటలూ'
'సౌందరనందం'
'రమ్యాలోకం'
చదవకపోతే
నవకవి కాడూ !

'కిన్నెరసానిన్ని'
'హృదయేశ్వరినీ'
'దీపావళినీ'
'కృషీవలుణ్ణి'
ఎరుగకపోతే
నవకవి కాడూ!

కోకిలగూర్చి
చంద్రుని గూర్చి
ప్రేయసిగూర్చి
ప్రేమనుగూర్చి
వ్రాయకపోతే
నవకవికాడూ!

చిత్రలేఖనం
గాత్రమార్దవం
నాట్యభంగిమం
శిల్పకౌశలం
భావపేశలం
తెలియకపోతే
నవకవికాడూ!



['వాణి' నుంచి]

## SUBSTITUTES

వికృతి
ప్రక్రియ
దూరాలోయ్ !

ప్రకృతి
ఝుంకృతి
కావాలోయ్ !

'సూరన'
'సోమన'
దూరాలోయ్ !

'బైరను'
'బరన్సు'
కావాలోయ్ !

నశ్యం
జోశ్యం
దూరాలోయ్ !

లాస్యం
హాస్యం
కావాలోయ్ !

'త్యాగయ'
'దీక్షితు'
దూరాలోయ్ !

'సైగలు'
'పంకజు'
కావాలోయ్ !

పింజలు
పూజలు
దూరాలోయ్ !

'పైజమ'
'పోజులు'
కావాలోయ్ !

పోషణ
శోషణ
దూరాలోయ్ !

'ఫ్యాషను'
'నేషను'
కావాలోయ్ !

'ఈష్టర్న్'
'రష్టికన్'
దూరాలోయ్ !

'వెష్టర్న్'
'లష్టర్న్'
కావాలోయ్ !

ఛందస్సు
పంథాలు
　　దూరాలోయ్ !

మాదారి
రాధారి
　　కావాలోయ్ !

నాటువి
నాటివి
　　దూరాలోయ్ !

నగ్నత
నవ్యత
　　కావాలోయ్ !



## (క) వనవిహారం

పోదాం పదండి పోదాం!
పెరట్లో చెట్లను చూదాం!

'గురజాడ' వృక్షం
మహాదొడ్డ వృక్షం
రానున్న వాటికీ
రాణించులక్ష్యం!

'పింగళి కాటూర్ల'
ప్రీతైన మొలకా
బుద్ధసాధుత్వం
సాధించు మొలకా!

'రాయప్రో'లంటూ
రమ్యమౌ అంటూ
మృదుత్వ మాధురికి
మేలైన అంటూ!

'బసవరాజు'వారి
భేషైనవిత్తూ
ఎరుగలేనివారి
జేస్తుంది - 'చిత్తూ'!

'నందూరి' మొకా
నాణ్యమా మొకా
రుచిచూచువారికీ
రసికతే—' షకా '!

'విశ్వనాథ'వారి
విలువైన దుంపా
తవ్వి తరిగినవారె
తినగలుగుదుంపా !

'అబ్బూరి' వారీ
కర్పూర కదళీ
అందరికి రుచించు
అందాల కదళీ !

'దేవులపల్లి' వారి
దివ్యమాదుబ్బా
కదిలిస్తె చాలూ
కన్నీటి జాలూ !

'బాపిమామ'వారి
బలుమంచి తీవా
పెనవేసుకొన్నది
పలునాళ్లనుంచీ !

'శ్రీరంగం'వారి
సరికొత్త 'క్రోటన్'
తావివద్దంటే
తగుమంచి 'క్రోటన్'!

'పట్టాభి'వారి
పొడుగైన దంట్లూ
పనికొచ్చువారికీ
బహుమంచిదంట్లూ!

సాధన సమితోరి
సరసమాసంతా
సరకులనన్నింటి
సమకూర్చుసంతా!

పోదాం పదండి పోదాం!
పెరట్లో చెట్లను చూదాం!

['కృష్ణాపత్రిక' నుం



# లయం

ధృతి నిల్పుమోయీ
నేడైన
శ్రుతిగోల్పుమోయీ
నీ వీణ !

విపద్భావమ్ములకు
విస్తుపోవక నీవు
ప్రేమైక్యసూత్రమ్ము
ప్రియముతో బఠియింప...

వియత్పథమ్ములలో
విహరింపజేయునా
లలితకలాలయమ్ము
చలితతంత్రుల జేర్చి

ధృతి నిల్పుమోయీ
నేడైన
శ్రుతిగోల్పుమోయీ
నీ వీణ !

['తెలుగుతల్లి' నుంచి]

# 'ములాఖాత్'

'సరకులనన్నింటి సమకూర్చే 'సంత' అని స్థాపనసమితికి ఈ కవివర్యు లిచ్చిన పరిచయం. ఇప్పట్ల కొంటెకోణంగులంతా కలిసి 'సంత' పదాని కేం వ్యాఖ్యానాలు చేసినా, మేముమాత్రం పద్యగేయకావ్యాలు వరుసగా ప్రకటించి క్రొత్త పాతల మేలికూర్పునైతే ఋజువుచేసుకున్నాం.

మా మధుకోశాని కీ "మధుకణాల" నందిచ్చిన కవిమధుకరుని గూర్చి వేరే 'ములాఖాత్' చేయబోతే 'మీరు పెద్దలంటే మీరు పెద్దల'న్న ఫక్కీలోకి దిగుతుంది, సమితితోడి వారి అవినాభావాన్నిబట్టి. మేము ఆదిలో తెలుగుభారతి కెత్తిన "అంజలి"లోనే వారి కవితా ప్రసూనాల నెత్తావులు గుబాళించి అందిరినీ ఆకర్షించినాయి. కర్త నాటి నేటి తేనెచినుకుల నేకత్ర చేసి ఈ పాత్రిక నందిచ్చటంలో మాతో సమోత్సాహం పూనటం చాలా హర్షణీయం !

ఇప్పట్ల నవ్యసాహిత్యోపద్రష్టలు గురుపాదులైన బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అమూల్యపరిచయవాక్కులకు సమితిపక్షానా, కవితరఫునాకూడా మా నమోవాకములు. దీనికి ముఖచిత్రాన్ని అందిచ్చిన మా చిత్రకారులు శ్రీ కందాళ సత్యనారాయణగారికి అభివందనాలు. మా కవి చిత్రకారు లిరువురకీ ఇతోధిక శ్రేయోభివృద్ధులు దేవగురువు లాకాంక్షించాలి. ఈ ప్రచురణకై మాకు సాయపడిన పూజ్యులందరికీ నమస్కరిస్తూ మా రాబోయే నాటికా ప్రచురణకై మా చదువరులను హెచ్చరిస్తూ సెలవు తీసుకుంటాము.

ఇట్లు,

కార్యదర్శులు.

# గేయాలు :

## మహారాజపోషకులు

శ్రీశ్రీశ్రీ విజయనగరము మహారాజావారు

## పోషకులు

శ్రీ ఇల్లిందల రామచంద్రరావు; హెచ్. సి. యస్.
,, తాడేపల్లి శివరామకృష్ణయ్య
,, జమ్మలమడక వెంకటకృష్ణయ్య
,, ఎ. వి. పట్టాభిరామ మొదలియారు
,, చెంగల్వల నారాయణరావు
,, విష్ణుభొట్ల వెంకట్రామయ్య
,, శ్రీధర వెంకట్రామన్న
,, వి. నరసింగరావుదేశాయి
,, జమ్మలమడక వెంకట దత్తాత్రేయులు
,, శిర్నాం సత్యనారాయణ
,, గొత్తి లక్ష్మీనారాయణ
,, అన్నదేవర నాగరాజం
,, మల్లికార్జునరావు
శ్రీమతి యమ్. వి. కమలాదేవి